గుంటూరు అఫిషియల్ రిసీవరుగారివల్ల జరుపబడు స్థిరాస్తి

## వేలం నోటీసు

ఐ. పి. 20/48 సబుకోర్టు గుంటూరు. అరవపల్లి వెంకట్రావు - ఇన్సాల్వెంటు

వేలం జరుగు స్థలములు:

1. బాలత్రిపుర సుందరి రైస్ అండ్ ఆయిల్ మిల్లు, గుంటూరు 21-4-1956 న అయిటములు 3 (ఎ) & (బి).

2. ధనలక్ష్మి గ్రౌండునటు ఆయిల్ కంపెని, మంగళగిరి - 26-4-1956 అయిటములు 6 (ఎ) & (బి).

3. జయలక్ష్మి జిన్నింగ్ అండ్ గ్రౌండ్ నట్ ఫ్యాక్టరి, పిడుగురాళ్ళ 28-4-1956 అయిటములు 4 (ఎ) & (బి).

క్రింద ఉదహరించు స్థిరాస్తిలో ఇన్సాల్వెంటుకుగల హక్కు బాధ్యత సంబంధములను గుంటూరు అఫిషియల్ రిసీవరుగారు పై పేర్కొన బడిన ఫ్యాక్టరి ఆవరణలయందు ఆయా తేదీలయందు పగలు గం. 12 మొదలు బహిరంగముగ వేలము వేయబడును. పాటదారులు వేలముయొక్క నిబంధనలను ముందుగ గాని, వేలము సమయమునగాని అఫిషియల్ రిసీవరుగారి ఆఫీసులో కనుగొన వచ్చును.

### జాబితా

3. (ఎ) (3-5 ఐటములు) గుంటూరు 16-వ వార్డు అసస్‌మెంటు 12153 బాలత్రిపుర సుందరి రైస్ అండ్ ఆయిల్ మిల్లు,

T S.No. 538/2 యు 3-48124 చ.అ.
T S.No. 538/1 యు 6-10890 చ.అ.
T.S.No. 531/16యు 0-12854 చ.అ.
T S.No. 546/3 యు 4-0 చ.అ.

సదరు విస్తీర్ణమునకు హద్దులు: ఉ॥ మన్ చెప్పటురోడ్డు, తూ॥ బుడంపాడు రోడ్డు, ద॥ అనంతవరప్పాడుడొంక, ప॥ కోటిరెడ్డిగారి ఇల్లు, ఇందులో ఇన్సాల్వెంటుకుగల ½ భాగము, ఇందులో కట్టియున్న ఫ్యాక్టరిబిల్డింగ్సు, మిషనరీలు, ఇంజను బాయిలర్లు వగైరా యావత్తుమిల్లుసామానులున్ను, మార్షల్ కార్నిష్ బాయిలరు శైఫ డబుల్ సిలిండరు కాంపౌండుఇంజను, 2 షెల్లర్లు 4 హల్లర్లు రైసు వర్కింగు మిషనరీ ఇందులో ఇన్సాల్వెంటుకుగల ½ భాగమున్ను.

ఈ మిల్లులో ఇన్సాల్వెంటుకు సంపూర్ణ హక్కుగల 2 డికార్టికేటర్లు, 1 హస్కుజన్, 4 ఎక్సుపెల్లర్లు, 1 ఫిల్టరు, 1 షెల్లరు కన్వెక్టింగుషాఫ్టు, పుల్లీ వగైరా మొత్తం చేరుకేవగ స్టక్కను.

-రు. 51,000/-

N.B: 9-7-55 నుంచి 8-7-58 వరకుగల కౌలుహక్కుకు లోబడి,

(బి) పై 3 ఎ అయిటములో ఉదహరించిన ఫ్యాక్టరి బిల్డింగ్సు, మెషినరి వగైరాలుపోను ప్రహరిగోడల వెలుపల శేషించిన ఖాళీస్థలములో ఇన్సాల్వెంటుకుగల సగం హక్కు. రు. 50,000/-

N. B: 9-7-55 నుంచి 8-7-58 వరకుగల కౌలుహక్కుకు లోబడి.

### పిడుగురాళ్ళ

4. (ఎ) (6 అయిటము) జయలక్ష్మి జిన్నింగు అండ్ గ్రౌండ్‌నట్ ఫ్యాక్టరి, పిడుగురాళ్ళ (a) S. No. 223/4 యు. 1-27 కు హద్దులు: తూ॥ పిల్లలమఱ్ఱి ఆంజనేయులు, జానపాటి తిరుపతిరావు భూములు ద॥ రైలురోడ్డు ప॥ జనరల్ రోడ్డు ఉ॥ S. No. 228/2 (95 సెంటులున్ను) 228/3 యు. 1-32 సెంటులున్ను క్వారిన్ని (b) S. No. 228/2 (95 సెంట్లు) పైరసి యు. 2-27 సెంటులకు హద్దులు: తూ॥ మందా ముత్తాయి స్థలము ద॥ S. No. 223/4 యు. 1-27 సెంట్లు ప॥ రాతిక్వారి ఉ॥ ఉడతా పిచ్చయ్య, యేలూరి నారాయణగార్ల స్థలములు. రు. 25,000/-

N. B: ఇన్సాల్వెంటుకుగల ½ భాగము 1956 సం॥ వరకుగల కౌలు హక్కుకు లోబడి.

(బి) (7 అయిటము) మెషనరి M 148 పోర్టబుల్ ఇంజను 6 జిన్నింగు మిషనులు 1 డికార్టికేటరు 1 చేరుకేవగ జల్లెడ 1 ప్రత్తిజల్లెడ షాఫ్టింగు పుల్లీలు బెల్టులు మరియు యు. 3-54 సెంట్లు లోని ఇతర మిషనరి కట్టడములు.

రు. 1600/-

N. B: 1956 సం॥ వరకుగల కౌలు హక్కుకు లోబడి.

### మంగళగిరి

6. (ఎ) (8 అయిటము) ధనలక్ష్మి గ్రౌండ్‌నట్ ఆయిల్ కంపెని మంగళగిరి. S. No. 268 A పంచాయితీ అసస్‌మెంటు 173 యు. 4-75 లోని పాతికట్టడములు, పాత మిషనరిసామానులు ఉ॥ నిడమర్రురోడ్డు తూ॥ గుంటూరు విజయవాడరోడ్డు ద॥ S. No. 268 B. కొమ్మారెడ్డి వెంకటరెడ్డి ఉయ్యూరు కోటిరెడ్డి వగైరాల స్థలములు, ప॥ S. No. 260 A-1 చింతక్రింది కనకయ్య వగైరాల ఫ్యాక్టరి.

ఇందులో ఇన్సాల్వెంటుకుగల ½ భాగము 1957 ఫిబ్రవరి వరకుగల కౌలు హక్కుకు లోబడి.

(బి) S. No. 274 C యు 1 ఎకరము యు. 2-43 సెంట్లు మంగళగిరి యు. 0-81 సెంట్లు రోడ్డు మార్జిన్‌భూమిలో పోగా క్రింద పోయిన యు 0-29 సెంట్లు పోగా యు 0-53 సెంట్లు ఇందులోని రాతిక్వారి వాడిన్ని. రు. 16,000/-

అక్కరాజు సాంబశివరావు, అఫిషియల్ రిసీవరు ఇన్-ఛార్జి. అఫిషియల్ రిసీవరు ఆఫీసు.
18-4-1956. గుంటూరు.

---

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు
టెండరులు కావలెను
నెం. AA4-1285/56

"జంతుశాస్త్ర, వృక్షశాస్త్ర శాఖలకు ఇవ్వబడు వరుసగా ఉపయోగపడు చున్న W/D షెడ్లు T/21-B మరియు T-31-A యొక్క షెడ్ల పునరుద్ధరణ" పనికి రిజిస్ట్రార్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేర్ వారు 2-5-56 బుధవారము సా. 4 గంటలవరకూ సీలు వేసిన టెండరులను తీసుకొనెదరు. ధరక్రింద రు. 2 లకు దరఖాస్తు పంపిన, షెడ్యూళ్లు, స్పెసిఫికేషనులను రిజిస్ట్రార్ నుండి పొందగలరు.

డిప్యూటి రిజిస్ట్రార్, వాల్తేర్.

---

### టెండరు నోటీసు

1956-57 సంవత్సరానికి ఎండుగడ్డి, ఎండిన జొన్నచొప్ప, పచ్చి జొన్నచొప్ప, జనపకట్టలు సప్లయికి గుంటూరు మున్సిపల్ కమీషనర్ 20-4-56 తేదీ సా. 3 గంటలవరకూ సీలు వేసిన టెండరులను తీసుకొనెదరు. అదే తేదీన సా. 4 గంటలకు మున్సిపల్ ఆఫీసులో హాజరైన టెండరుదారుల సమక్షములో తెరిచెదరు. ఆఫీసు పనిచేయు అన్ని రోజులలో మున్సిపల్ కమీషనర్, గుంటూరు, వారినుండి దరఖాస్తు చేసి, డిపాజిటు వగైరా వివరాలు పొందవచ్చును.

టి. కమలవిష్ణు, కమీషనర్ & హెల్తు ఆఫీసర్ ఇన్-ఛార్జి, మున్సిపల్ ఆఫీసు, గుంటూరు. 5-4-56.

---

తెనాలి ప్రిన్సిపల్ సబ్‌కోర్టులో
O. S. 65/54

వాది: చేబ్రోలు షేకు లాలు అహమ్మద్ సాహెబు.

ప్రతివాదులు: షేక్ నసీబీ వగైరా.

4 వ ప్రతివాదికి: లింగం వెంకటేశ్వర్లు S/o సుబ్బయ్య సా॥ కొలకలూరు

వాది స్వాధీనం వగైరా పరిహారముల నిమిత్తం దావా దాఖలు చేసి యున్నందున, నీకు దావా నోటీసు పబ్లికేషన్ నిమిత్తం 28-4-56కు వాయిదా వేయబడినది గాన నీకు ఆక్షేపణ లున్నయెడల ఆరోజున ఉ. 10 గంటలకు నీవు సదరు కోర్టుకు హాజరైనవిచేసుకోనేది.

లక్కరాజు వెంకటసుబ్బారావు, వాది అడ్వకేటు, 10-4-56.

---

తిరుమల-తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

తిరుపతిలో ఉన్న శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ & ఓరియంటల్ కాలేజీలోని సంస్కృతం (సాధారణ సాహిత్యము); (శాస్త్రాలు (వేదాంతం); వేదాలు; శిల్పాలతో సహా ఆగమాలు; సంగీతం; తెలుగు; తమిళం; ప్రాత్రప్రతులసేకరణ శాఖలలో క్రింది ఉద్యోగాలకు 1-5-1956 తేదీన లేదా ఆ తేదీలోగాగానీ క్రింద సంతకం చేసినవారికి చేరేటట్లు దరఖాస్తులు పంపగోరుచున్నారు. జీతాలు, ఆయా ఉద్యోగాలకు ఎదురుగా పేర్కొన బడ్డవి; అదనంగా అలవెన్సులు ప్రభుత్వ రేట్ల ప్రకారంవుండును. సామాన్యంగా, నియమించిన అభ్యర్థి కనీస వేతనముతో ప్రారంభించబడును. అర్హులైన అభ్యర్థులకు, ఎక్కువ జీతంతో ప్రారంభించబడును. ప్రత్యేక కోర్సులు, గురుకులాలు, విద్యాపీఠాలు వంటి రికగ్నయిజ్డు జాతీయ సంస్థల టైటిల్ - హోల్డరులుకూడా దరఖాస్తు చేయ అర్హులై వున్నారు. నిర్ణయించటంలో ప్రధానంగా పరిశోధనా పనిలో అనుభవము ఆలోచనలోనికి తీసుకోబడును. దరఖాస్తుదారులు, వారి యోగ్యతలు, వయస్సు, కులము, పరిశోధనా అనుభవము తెలియజేస్తూ, ఇటీవల పొందిన సర్టిఫికెట్లు, వ్యాసాలు, లేదా వారు ప్రచురించిన పుస్తకాలు కాపీలు పంపవలెను. ఉద్యోగానికి దరఖాస్తు చేసేటప్పుడు, ఉద్యోగంలో చేరుటకు కావలసిన వ్యవధి, వారు దరఖాస్తు చేసిన ఉద్యోగానికి నిర్ణయించబడినప్పుడు, తక్కువ ఉద్యోగాన్ని ఆమోదించ సంసిద్ధముగా ఉన్నదీ, లేనిదీ కూడా వ్రాయవలెను.

తమ స్వంత ఖర్చుమీద ఇంటర్వ్యూకు అభ్యర్థులు విర్ణాయక సంఘం ముందుకు హాజరవుటకు సిద్ధంగా వుండాలి.

1. డైరెక్టర్: జీతంస్కేలు: రు. 500-25-750; కావలసిన అర్హతలు: ఎమ్. ఏ. పిహెచ్. డి. & ప్రచురించిన పరిశోధన ...(1 ఉద్యోగం)

2. శాఖల అధిపతులు: (ప్రొఫెసర్లు) స్కేలు: రు. 350-25-500; అర్హతలు: ఎమ్. ఏ. లేదా పండిత్-పిహెచ్. డి. (7 ఉద్యోగాలు)

3. లెక్చరర్లు: స్కేలు: రు. 150-5-200-10-250; అర్హతలు: ఎమ్. ఏ. లేదా పండిత్ (8 ఉద్యోగాలు)

4. అసిస్టెంట్ ప్రొఫెసర్లు: స్కేలు: రు. 230-30/2-260-40/2-500; అర్హతలు: ఎమ్. ఏ., లేదా పండిత్ - శాస్త్రాలలో సామర్థ్యం (8 ఉద్యోగాలు)

5. రీసెర్చి అసిస్టెంటు: స్కేలు: రు. 150-5-200-10-250; అర్హతలు: ఎమ్. ఏ., లేదా పండిత్ - (8 ఉద్యోగాలు)

6. లైబ్రేరియన్: స్కేలు: రు. 150-5-200-10-250; అర్హతలు: సంస్కృతం, తెలుగు పరిజ్ఞానంలో లైబ్రరీ పనిలో తర్ఫీదు పొందిన పట్టభద్రుడు. (1 ఉద్యోగం)

7. కాపీయిస్టులు: స్కేలు: రు. 75-5/2-100; అర్హతలు: శిరోమణి (6 ఉద్యోగాలు)

సి. అన్నారావు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, టి. టి. దేవస్థానములు, తిరుపతి. 14-4-1956.

---

# ఉత్సాహంతో గడిపే కాలం ఆయుర్దాయంలో లెక్కకురాదు

## ఉగాది వేడుకల్లో ప్రముఖుల ప్రసంగాలు

### విజయనగరం

విజయనగరం, ఏప్రిల్ 12: మహారాజా సంస్కృత కళాశాలలో ఉగాది సాహిత్యగోష్ఠి ఏర్పాటు చేశారు. శ్రీ తిరుమల నరసింహాచారి అధ్యక్షత వహించారు. శ్రీ జయంతి కామేశ్వర రావు స్వాగతం చెప్పారు.

శ్రీ వెంకటరావు "భౌతిక విజ్ఞాని దృష్టిలో, సూర్యుడు - చంద్రుడు" అనే పద్యాలు చదివారు. శ్రీ భావ్యకారాచార్యులు "ఉగాది-జ్యోతిష సాంప్రదాయాలు" గురించి మాట్లాడుతూ 'యుగాది' 'ఉగాది'గా మారివుంటుందన్నారు. ఆయన యిల్లా అన్నారు: "సంవత్సరానికి కూడా యుగమని వ్యవహారం ఉండబట్టి సంవత్సరాదిని 'యుగాది' అని వుంటారు. ఆ యుగాది 'ఉగాది' అయింది. సంవత్సరాలకు ప్రభవ, విభవ మొదలైన పేర్లుపెట్టారు. అలాగే నెలలకూ తిథులకూ పేర్లుపెట్టారు. ఈ పేర్లకూ ఆకాశంలో వున్న గ్రహస్థితికీ సంబంధం ఉన్నది. చిత్తానక్షత్రయుక్తుడై చంద్రుడు కనబడే నెల చైత్రము. పండుగదినాల్లో ఉత్సాహంతోనూ ఆనందంతోనూ ప్రజలు ఉండాలి. ఇలాంటి ఉత్సాహకరమైన దినాలు ఆయుర్దాయంలో లెక్కకు రావట. అందువల్ల ఆయురభివృద్ధి కలుగుతుందన్నమాట. అందుకే ఈ లాంటి సాహిత్య గోష్ఠులూ అవీన్నీ."

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, ఆశు కవితాగానం చేశారు. శ్రీ వాజపేయ యాజుల సుబ్రహ్మణ్య చయనులు ఉగాది మీద పద్యాలు చదివారు. శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు ప్రసంగించారు. శ్రీ తుమరాడ సత్యనారాయణ శాస్త్రి "నేటి తెలుగు" అనే వ్యాసం చదివారు. శ్రీ మిరియాల రామకృష్ణ "శారదాయణం" చదివారు.

అధ్యక్షులు తమ ముగింపు మాటలలో, మన పండితులకు ఆధ్యాత్మిక దృష్టి ఎక్కువయిపోవడంవల్ల నూతన మార్గాలు తొక్కలేక పోతున్నారనీ, సమర్థులు తమ ప్రజ్ఞను అందరికీ వినియోగపడే విధానాలు అన్వేషించాలనీ, ప్రాచీ ప్రతీచీ విద్యలను అభ్యసించిన వారి మధ్య అపోహలు పెరిగి పోవడంవల్ల మన భాష, సాహిత్య విషయాల్లో ఒక గమ్యాన్ని చేరలేక పోతున్నామనీ చెప్పారు. వివిధ సందర్భాలలో తాము రచించిన పద్యాలు చదివారు. శ్రీ కె. వి. నరసింహాచార్య వందనా లర్పించారు.

### ఢిల్లీ ఆంధ్రుల ఉగాది పండుగ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: ఆంధ్ర సంఘం అధ్వర్యాన ఆంధ్ర విద్యాభవనంలో ఉగాది పండుగ జరిగింది. పుర్తాళం శ్రీ సిద్ధేశ్వరి పీఠాధిపతులు శ్రీ జగద్గురు త్రివిక్రమరామానందభారతీ స్వాములవారు అధ్యక్షత వహించి ఆశీర్వదించారు.

సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ బచ్చు జగన్నాథదాసు, శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు, శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ భాగవతుల విశ్వనాథం పలువురు ఆంధ్రేతరులుకూడా ఉత్సవానికి వచ్చారు.

శ్రీ బచ్చు జగన్నాథదాసుగారు త్రివిక్రమరామానందభారతీస్వాములవారినిసభ్యులకుపరిచయంచేశారు. స్వాములవారు, పూర్వ శ్రీమంలో చెనక, న్యాయవాదులనీ, ఆ విధంగా తమకు వృత్తిరీత్యా బంధుత్వ మున్నదనీ, ఒరిస్సాలో తాము ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నప్పుడు కూడా శ్రీ స్వాములవారు వేంచేసి అక్కడి ఆంధ్రులకు తమ దర్శన భాగ్యమిప్పించారనీ చెపుతూ, సభ తరఫున ఈనాటి కార్యక్రమానికి అధ్యక్షత వహించవలసిందని కోరారు.

స్వాములవారి శిష్యుల వేద పఠనంతో కార్యక్రమం ప్రారంభమైంది. శ్రీ ఇ.వి.శాస్త్రిగారు పంచాంగ పఠనం చేశారు. శ్రీ స్వాములవారు రామాయణ భారత భాగవత పురాణ తతికాలలోని రసవత్తరమైన పద్యాలూ, శ్లోకాలూ శ్రావ్యంగా వినిపిస్తూ, భక్తిబోధ చేశారు.

తరువాత శ్రీమతి వంగల వాణీబాయి సంస్కృత శ్లోకాలు కొన్ని గానం చేశారు.

శ్రీ నటరాజ రామకృష్ణ భరత నాట్య భంగిమలు, అర్థవివరణ సహితంగా ప్రదర్శించారు.

ఆంధ్ర సంఘం అధ్యక్షుడు శ్రీ పింగళి రాఘవరావు కోరిక మీద, శ్రీ తెన్నేటి విశ్వనాథం ప్రసంగించారు.

### జంషెడ్పూరు

జంషెడ్పూరులో ఆంధ్ర సంఘం జరిపిన ఉత్సవానికి అనేకమంది స్త్రీలు పురుషులు, బాల, బాలికలు వచ్చారు. శ్రీ పి. కె. జె. ఆర్. రాజు అధ్యక్షత వహించారు. పంచాంగశ్రవణం, బాల, బాలికల పాటకచ్చేరి, వద్దంటే పెళ్లి అనే నాటకను జరిపించారు. లేబర్ కార్మికసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ వి. జి. గోపాల్ సంస్థ సహపురియూన్ని పాఠశాల విద్యార్థులకు అనేకకార్లైన ఆటవస్తువులను బహూకరించారు.

ఆంధ్ర సంఘ కార్యవర్గం అధ్యక్షుడు శ్రీ సి. కె. జె. ఆర్. రాజు ఉపాధ్యక్షుడు శ్రీయుతులు కె. తిరుమలరావు శ్రీ బి. జగన్నాథముగార్లు, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. వి. సోమయాజులు, సంయుక్త కార్యదర్శులు శ్రీయుతులు ఏ. వి. జగన్నాథరావు, యస్. లక్ష్మణరావు, కోశాధికారి శ్రీ ఆర్. రాఘవరావు, సభ్యులు శ్రీయుతులు డి. వి. రెడ్డి, యస్. రామారావు, జి. వి. శాస్త్రి, యం. వి. శాస్త్రి, యం. వెంకటరావు, కె. సింహాచలం, యు. సత్యనారాయణ, జి. వి. అప్పారావు.

పాఠశాల పుస్తకాలయ భవననిర్మాణంకోసం తంగ్రనసంఘానికి తాత్కాలికంగానైనా చక్కని స్థలం ఇవ్వాలని నిశ్చయించారు.

### రాజమండ్రిలో

రాజమండ్రి, ఏప్రిల్ 13: సీతంపేట మనోరంజన సంఘం (రిక్రియేషన్ క్లబ్బు) నిన్న సాయంత్రము తమ క్లబ్బు ఆవరణలో - పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ వోగుల వీరభద్రరావు అధ్యక్షతన ఉగాది వేడుకల జరుపుకున్నారు. కేంద్రప్రభుత్వ పొగాకు పరిశోధనాలయ డైరెక్టర్ ఎన్. ఆర్. భట్ ప్రధమంగా ప్రసంగిస్తూ క్లబ్బులు మనోల్లాసమును కలిగించేందుకుగాను ఏర్పడిన సమాజ సౌకర్యములనీ, యీ సంఘాలను సద్వినియోగము చేసుకుని సభ్యులు జీవితములో స్వయంగా అభివృద్ధి చెందుటయేగాక, రానున్న పుష్కర ములవంటి సమయములలో ఎంతో సంఘసేవ చేయవచ్చుననీ సలహా యిచ్చారు. శ్రీ అవసరాలరామారావు ఈజిప్టు - ఇటలీ - ఇంగ్లండులలో గాంధీయ తత్వప్రచార క్లబ్బులగురించి తాము చూచిన విషయం చెప్పారు. శ్రీ జమ్మి కృష్ణమూర్తి యీ క్లబ్బునాశీర్వదిస్తూ తాము దీర్ఘకాలము ఇంగ్లండులో వుండి చూచిన ఇంగ్లీషు క్లబ్బులసత్సాంప్రదాయము వివరించారు. శ్రీ మారిన లాలారామ్‌జీ పౌరశిక్షణ తరగతుల నిర్వహణగూర్చి సూచనలిచ్చారు.

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి మన సాహిత్యమును గురించి ఉపన్యసిస్తూ స్వతంత్ర పౌరులమైన మనముదేశక్లబ్బుల సద్గుణాలను తెలుసుకొనుట మంచిదేగాని, మన పూర్వులు క్లబ్బు అనే పేరుతో గాకపోయినా మరోక రూపంగా సారస్వత పఠనమూ, కావ్యపరిజ్ఞానమూ, శాస్త్రవిజ్ఞానమూ పలువురకు తెలిసేందుకుగాను సాహిత్య రచనల ఎట్లుచేశారో వివరించారు.

శ్రీ చిర్రావూరి అనంత పద్మనాభశాస్త్రి క్లబ్బును ఆశీర్వదించారు. శ్రీ ఉండవల్లి శంకరకోటేశ్వరరావు మాట్లాడిన తర్వాత, సభ్యుల విచిత్ర వేషాలూ, ఏకపాత్రాభినయములూ, గానసభ జరిగినవి. ఆటల పోటీలలో గెల్చినవారికి బహుమతులీయబడినవి.

### విశాఖపట్నం

విశాఖ రచయితల సంఘ అధ్వర్యాన సిటీ హైస్కూలు సాహిత్యగోష్ఠి జరిగింది. "ఆధునిక ఆంధ్ర సాహిత్య రీతులు, వివిధ్న భాషావాదాలు గూర్చి గోష్ఠి జరిపారు. శ్రీ పురిపండా అప్పలస్వామి, చెంద్రపోలు సూర్యనారాయణరావు, బలివాడ కాంతరావు, నానిశెట్టి కృష్ణారావు, అంగర వెంకటకృష్ణారావు, అంగర మార్యారావు, మనూనాముష్కు రచయితలు. పురజనులు గోష్ఠిలో పాల్గొన్నారు. రచయితల సంఘ యాజమాన్యాన ప్రచురణ శాఖ నిర్వహించాలని నిర్ణయించారు.

### చల్లపల్లి

చల్లపల్లి సాహితీ సమితి అధ్వర్యాన కవితా గోష్ఠి జరిగింది. శ్రీ తుమ్మల శ్రీరాములు, శ్రీమూర్తి, శ్రీ బి. యస్. శాస్త్రి పాల్గొన్నారు. శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు (ఘంటసాల ఉన్నత పాఠశాల తెలుగు పండితులు) అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షులు శ్రీ తుమ్మల గోపాల కృష్ణయ్య అభివందనలు చెప్పారు.

---

## ఏటికొప్పాక చక్కెర ఫ్యాక్టరి

### చెరకు సరఫరాస్థితి పరిశీలన

యలమంచిలి, ఏప్రిల్ 13: ఆంధ్ర దేశంలో పంచదార ఫ్యాక్టరీలకు, చెరకు ఏవిధంగా సరఫరా అవుతున్నదీ విచారించడానికి, ప్రభుత్వం నియమించిన సంఘ సభ్యులు, మొన్న 9 వ తేదీ సాయంత్రం ఏటికొప్పాక పంచదార ఫ్యాక్టరీకి వచ్చారు. డిప్యూటీ జరిస్ట్రారు, వారికి స్వాగతమిచ్చారు. తరువాత, విచారణసంఘం డైరెక్టర్లతో ప్రశ్నావళి విషయం చర్చించారు. శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు, విచారణ సంఘ సభ్యుల గౌరవార్థం విందు చేశారు.

10 వ తేదీ ఉదయం, తిరిగి ఫ్యాక్టరీ సభ్యుల సమావేశంలో, ప్రశ్నావళి విషయం చర్చజరిగింది. ఈ ఫ్యాక్టరీకి కావలసిన చెరకుకంటె, ఎక్కువగానే, సభ్యులు పండిస్తున్నందువ, ఫ్యాక్టరీకి చెరకు పంటభూమిని ప్రత్యేకించవలసిన అవసరంలేదని, సభ్యులు వాటాల టన్నుల చొప్పున సరఫరా చేయగా మిగిలిపోయిన చెరకును ఫ్యాక్టరీ తీసుకోవటంలో ఒకటి రెండు వాటాలున్న వారికి ప్రాధాన్యం యివ్వాలని పలువురు సూచించారు.

ఆ తరువాత యలమంచిలి, సర్పీపట్నం చెరకు ఉత్పత్తిదారు సంఘం శ్రీ వెంకటరమణ అధ్వర్యాన విచారణ సంఘ సభ్యులను కలుసుకొని, ఫ్యాక్టరీలలో సభ్యులుకాని రైతులు పండించే చెరకునుకూడా ఫ్యాక్టరీలు తీసుకోవాలని కోరుతూ, విజ్ఞాపనలు సమర్పించారు.

---

## పంచాయతీ ఎన్నికల ఫలితాలు

### పిఠాపురం

ఈ పంచాయతీ బోర్డుకు 10, 8, 4 వార్డులనుండి యీ దిగువవారు పోటీ లేకుండా ఎన్నికైనారు.

శ్రీయుతులు కొత్త కామరాజు (10 వా) కొలైం మాణిక్యం (8 వా) డి.సి. బి. వెంకట్రావు, పోతిర్లగడ్డ బాలకృష్ణ (4 వా.)

లెక్కిన 8 వార్డులలో 11 స్థానాలకు పోటీ తీవ్రంగా ఉన్నది.

### చేబ్రోలు

ఈ పంచాయతీ బోర్డులోని అన్ని స్థానాలకు, యీ దిగువవారు ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

శ్రీయుతులు ఓరుగంటి చల్లా రావు తుమ్మలపల్లి అచ్చారావు, గారపాటి చిన అప్పలస్వామి, ఓరుగంటి ముత్తారావు, గుద్దిటి సుబ్బరాజు, సిద్దా సూర్యనారాయణమూర్తి, దాసరి వీరరాజు, సందమూరి రంగారావు, చిన్నం ముసలయ్య.

### ఎరవాడ

ఈ పంచాయతీ బోర్డుకు యీ దిగువ సభ్యులు ఎన్నికైనారు.

శ్రీయుతులు దారా నారాయుడు, కందస్వాములు (వీరిద్దరూ పోటీ లేకుండా గెలిచారు.)

కంద కొండలరావు, ఎర్ర శేషగిరిరావు, రామిశెట్టి కోటేశ్వరరావు, కంద ఉప్పయ, పెదిరెడ్డి సత్యింసాత్రుడు, కోమిరెడ్డి మంగరాజు.

### గొల్లల మామిడాడ

ఈ పంచాయతీకి యీ దిగువ సభ్యులు ఎన్నికైనారు.

శ్రీయుతులు ద్వారపూడి ఆదెయ్య, కర్రి మాచరరెడ్డి, కర్రి బాలిరెడ్డి, సుందరపల్లి సత్తెయ్య, మేడపాటి తిమ్మిరెడ్డి మేడపాటి బరోరెడ్డి, అనుజారి సుబ్బారావు, మండా రామకృష్ణారెడ్డి, సత్తు వీరన్న, దడాల అప్పారావు.

### కందుకూరు

ఈపంచాయితీకి దిగువ సభ్యులు ఎన్నికైనారు.

శ్రీయుతులు నందివనము సుబ్బరామయ్య, అలహరి కొండయ్య, పిన్నం రాజా నరసింహరావు, దివికుమారస్వామి, ముప్పరాజు కోటీశ్వర్లు, మురారిశెట్టి వెంకటేశ్వర్లు, ముత్తవల్లి అబ్దుల్ బషీర్, షేక్ బాబా మొహిద్దీన్, వలపర్ల నరసింహం, దివి పిచ్చయ్యచౌదరి షేక్ జాఫర్ భాషా, పి. నరసింహం కల్లూరి కొండయ్య, పూర్వం ఉన్న సభ్యులలో 6 గురు పోటీచేశారు. 5 గురు ఎన్నికైనారు. అధ్యక్షుని ఎన్నిక యీనెల 29 న జరుగుతుంది.

---

## పెల్లూరు స్టేషను ప్రారంభోత్సవం

ఒంగోలు, ఏప్రిల్ 13: ఇక్కడికి 8 మైళ్ళలో ఒంగోలు — సూరారెడ్డిపాలెం స్టేషన్‌లమధ్య పెల్లూరు స్టేషనును సబ్‌జడ్జి శ్రీ ఎ. ఎల్. నరసింహారావు నిన్న ప్రారంభోత్సవం చేశారు. సభికులకు దక్షిణ రైల్వేమండలరవాణా శాఖ (బెజవాడ) అసిస్టెంట్ సూపరింటెండెంట్ శ్రీ సి. కృష్ణయ్యర్ స్వాగతం చెప్పారు. పార్లమెంట్ సభ్యుడు శ్రీ వి. పి. శేషవరావు జాతీయపతాకోత్సవం చేశారు. ఈ స్టేషను నిర్మాణానికి సుమారు రూ. 5 లక్షలు అయింది.

ఇంతవరకు నిర్మించిన అయిదు క్రాసింగ్ స్టేషన్‌లలో చకిచర్ల, వలివేరు, పెల్లూరు స్టేషన్‌ల ప్రారంభోత్సవం జరిగిందని శ్రీ కృష్ణయ్యర్ వివరించారు. ప్రజల సహకారం లేనిదే రైల్వేశాఖ ఉద్యోగులు చేయగలిగినదేమీ లేదని చెప్పి అనవసరంగా గొలుసులాగే చెడ్డ అలవాటు మానుకోమని, టికెట్ లేకుండా ప్రయాణంచేసేవారిని పట్టి ఇవ్వమని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

స్టేషనుకు రోడ్డు వేయించే పనిలో సహకరించమని పెల్లూరు గ్రామస్థులకు శ్రీ శేషవరావు విజ్ఞప్తిచేశారు. శ్రీ గాలి గోటయ్య కూడా ప్రసంగించారు. శ్రీయుతులు జె. హారిస్, ఎస్. త్యాగరాజన్, మహమ్మద్ ఇస్మాయిల్ ఖాన్ మొదలైనవారు సభకు వచ్చారు. శ్రీ కృష్ణయ్యర్ వందనసమర్పణ చేశారు.

---

### శ్రీ రామనవమి

మద్రాసు, ఏప్రిల్ 16: షినాయ్ నగర్‌లోని శ్రీ సాయి నిలయంలో 19 వ తేదీన సాయంత్రం 6, 9 గంటలమధ్య శ్రీరామనవమి ఉత్సవం జరుగుతుంది. న్యాయమూర్తి శ్రీ కృష్ణస్వామి నాయుడు అధ్యక్షత వహిస్తారు.

---

ఈస్టు ఇండియన్ కాంపెనాయిల్ డిస్టిలరీస్ లిమిటెడ్, కుప్పం, మేనేజింగ్ డైరెక్టరు శ్రీ వి. వెంకటరత్నం తమ కుమార్తె చి॥ సౌ॥ కుమారి వసంతను శ్రీ జి. రాజగోపాల్ కుమారుడు చి॥ జి. నాగేంద్రప్రసాదు ఇచ్చి ఈనెల 15 న వివాహ మహోత్సవము జరిపారు.

---

## హైద్రాబాదు సాంఘికసేవ సలహా సంఘం

హైద్రాబాదు, ఏప్రిల్ 15:— ప్రస్తుతం నిమ్నజాతులు, నిమ్నతెగలు, మాజీ నేరస్థతెగలు మరియు ఇతర వెనుకబడిన తరగతులవారి సంక్షేమానికై పనిచేస్తున్నట్టి హరిజనసంక్షేమ సలహా సంఘం, కొండజాతుల సలహా సంఘం, పర్యవ్రా పిల్లల సంఘం, వెనుకబడిన తరగతుల సలహాబోర్డు, మాజీ నేరస్థతెగల సలహాబోర్డు, మొదలైన సలహా సంఘాన్ని రద్దుపరచడానికి, సాంఘికసేవ సలహా సంఘాన్ని పునర్నిర్మించడానికి రాజప్రముఖ్ ఆదేశించారు. సలహా సంఘంలో ఈ క్రింది 26 మంది అనధికార సభ్యులు ఉంటారు. అధ్యక్షుడు, హరిజన సేవక్ సంఘ్, శ్రీ కాశీనాథరావుజీ వైద్య, అధ్యక్షుడు ఆదిమజాతి సేవక్ సంఘ్ శ్రీ హెచ్. సి. హెడా, ఎం. పి, అధ్యక్షుడు, దళిత జాతీయ సంఘ్ శ్రీ ఎం. లక్ష్మయ్యాజీ, సోషల్ షెడ్యూల్డ్ క్యాస్టస్ ఫెడరేషన్ ప్రతినిధి శ్రీ జె. హెచ్. కృష్ణమూర్తి, కన్వీనర్ భారత్ సేవక్ సమాజ్ శ్రీ ఎం. నరసింగరావుజీ, ఇండియన్ కాన్ఫరెన్స్ ఆఫ్ సోషల్ వర్క్స్ ప్రతినిధి శ్రీ కె. వెంకటాచలం, తెలంగాణానుంచి ఒక లోకసభ సభ్యుడు శ్రీ ఎం. ఆర్. కృష్ణ, మరాట్వాడా నుంచి ఒక లోకసభ సభ్యుడు శ్రీ దేవరావు కాంబే, కర్నాటకనుంచి ఒక లోకసభ సభ్యుడు శ్రీ కృష్ణమాచార్య జోషీ, కర్నాటక ప్రాంత దళిత జాతీయసంఘ అధ్యక్షుడు శ్రీ అంబాదాస్ రావు, శ్రీమతి రాజమణిదేవి, శ్రీ ఇ. బస్సప్ప, శ్రీ డి. రామస్వామి, శ్రీ జె బి. ముత్యాలరావు, శ్రీ పి. లక్ష్మయ్య, శ్రీ మల్లప్ప కొల్లూరు, శ్రీ కొండా లక్ష్మణ్, శ్రీమతి సుమిత్రాబాయి, శ్రీ తేజ్ సింగ్ లాఖోడ్ శ్రీ దత్తాత్రేయరావు దొరాది, శ్రీ కల్యాణ్ రావు, శ్రీ ఎన్. వి. జగన్నాథం, శ్రీ అరిగె రామస్వామి వ్యవసాయశాఖ ఉపమంత్రి, శ్రీ వి. రామారావు, శ్రీ సురజ్ మల్ చౌదరీ, శ్రీ కె. రాజాలు.

### మహబూబ్ నగర దర్జీలు

మహబూబ్ నగరం జాతీయ దర్జీల సంఘం రిజిస్టరు అయింది. దీనికి హసన్ మొహమ్మద్ పహల్వాన్ అధ్యక్షుడుగాను, శ్రీ ఎన్. చంద్రయ్య కార్యదర్శిగాను వుంటారు.

### హిందుస్థాన్ భీమా ఉద్యోగుల సంఘం

హిందుస్థాన్ భీమా ఉద్యోగుల సంఘం హైద్రాబాదుశాఖ రిజిస్టరు అయింది. దీనికి శ్రీ హెచ్. పి. రాయ్ అధ్యక్షుడుగాను, శ్రీవి. సుబ్రహ్మణ్యన్ కార్యదర్శిగాను వుంటారు.

---

## పెద్ద చిన్న ప్యాపలిలో విద్యుద్దీపాలు

కల్యాణదుర్గం, ఏప్రిల్ 16: పెద్ద చిన్నప్యాపలి గ్రామములో విద్యుద్దీపాలకు శ్రీ సందా నారాయణప్ప మొన్న 10 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు. సభకు అసిస్టెంటు ఇంజనీర్లు జి. సుందరరాజు శ్రీ కె. వెంకటరంగయ్య ఉరవకొండ తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు-తదితరులు హాజరైనారు. తేనీటి విందు అనంతరం సభ జరిగింది.

ఇంజనీర్లు-శ్రీ కె. వెంకటరంగయ్య, శ్రీ జి. సుందరరాజు గారులు ఈ గ్రామమునకు-విద్యుచ్ఛక్తి సరఫరా కోసం మొత్తము రు 60 వేలు ప్రభుత్వము ఖర్చు పెట్టిందని, శ్రీ సందా నారాయణప్ప కృషి ఫలితంగానే, యీ గ్రామమునకు యీ సౌకర్యం కలిగిందని చెప్పారు.

శ్రీ సందా నారాయణప్ప ప్రభుత్వము గ్రామాలలో విద్యుచ్ఛక్తి సరఫరాకు చేస్తున్న కృషిని వివరించారు. శ్రీ బి. నరసింహప్ప, కరణం సీతారాములు కృతజ్ఞతాభి వందనాలు తెలిపారు.

---

## ఉద్యోగవార్తలు

కర్నూలు, ఏప్రిల్ 16: రైల్వేలు, సి. ఐ. డి. శాఖల పోలీసు డిప్యూటీ యిన్స్పెక్టర్ జనరల్ శ్రీ పి. కె. కె. నంబియార్ కు యీనెల 18 నుంచి ఒక మాసం సెలవు మంజూరు అయింది.

పోలీసు అసిస్టెంటు యిన్స్పెక్టర్ జనరల్ శ్రీ యస్. వి జయరంగంను శ్రీ నంబియార్ స్థానానికి నియమించారు. శ్రీ విజయరంగం ఈ కాలంలో కర్నూలు పోలీసు అసిస్టెంటు యిన్స్పెక్టర్ జనరల్ పదవిని గూడా నిర్వహిస్తారు.

ఏలూరుజిల్లా వ్యవసాయాధికారి శ్రీ డి. హనుమంతరావుకు మార్చి 21 నుంచి 3 ందుమాసాలు సెలవు మంజూరుచేశారు.

---

## దేశోద్ధారక వర్ధంతి

మద్రాసు, ఏప్రిల్ 17: తెలుగు పంచాంగం ప్రకారం దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి వర్ధంతి ఈ నెల 21 వ తేదీన వస్తుంది. ఇది పంతులుగారి 18 వ వర్ధంతి.

## శ్రీ కళా వెంకట్రావు

విశాఖపట్నం, ఏప్రిల్ 16: ఇక్కడ ప్రభుత్వ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న రాష్ట్ర రెవెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావుగారు క్రమంగా ఆరోగ్యాన్ని పొందుతున్నారు. వీరు ఆస్పత్రినుంచి ఈ నెల 21-వ తేదీన వచ్చేస్తారు.

---

# తాడేపల్లిగూడెం ప్రాంతంలో మంచిపంట

## గిరాకీ హెచ్చు: ధరలవృద్ధి

(స్వకీయ విలేఖరి)

తాడేపల్లిగూడెం ఏప్రిల్ 15: పది హేను రోజులలో రెండవ పంట ధాన్యం, నల్లార్లు (దాళ్వా), గారికె సన్నాలు, బంగారు తీగలు బజారుకు రావచ్చునని భావిస్తున్నారు. ఈ సంవత్సరం వేసంగి పంట బంగారు తీగలు బాగా పండింది. చాలా పొలాల్లో ఈ పంటే సాగుచేశారు. అప్పుడే బెంగాలు, కొచ్చిన్ అసాములు నల్లార్లు (దాళ్వా), గారికె సన్నాలు - బియ్యం జట్టీ పద్ధతిని బేరాలు చేయటం ప్రారంభించారు. బేరం ఖాయం అయినట్లు వర్తమానం రేపు రావచ్చునని మిల్లు యజమానులు భావిస్తున్నారు. బెంగాలు రాష్ట్రంలో ఉప్పుడు బియ్యానికి గిరాకీ హెచ్చుగా ఉన్నది. యీ వారం ధరలు కొద్దిగా పెరిగినవి.

ఈ వారం ధరలు: పచ్చిబియ్యం, ఉప్పుడు బియ్యం యెగుమతి ధరలు యీ విధంగా ఉన్నవి.

పచ్చిబియ్యం: సంచితో సహా- 164 పౌన్లు బస్తా

| | |
|---|---|
| గరికె సన్నాలు (జట్టీపద్ధతి) | 31-8-0 |
| అక్కుళ్లు రు | 34-4-0 |
| కృష్ణకాటులు | 37-0-0 |
| సన్న కృష్ణకాటుకలు | 38-0-0 |
| బంగారు తీగలు | 42-0-0 |

ఉప్పుడు బియ్యం

| | |
|---|---|
| గరికె సన్నాలు (జట్టీపద్ధతి) | 31-8-0 |
| అక్కుళ్లు | 33-12-0-34 |
| పైరు నువ్వులు 164 పౌ. | 68-0-0 |
| స్థానికంగా ధరలు ధాన్యం 166 పౌ-॥ | |
| అక్కుళ్లు | 24-4-0 |
| కృష్ణకాటుకలు | 23-0-0 |
| వేరునగరు 96 పౌన్లు | 18-0-0 |
| ,, నూనె 24 పౌను | 15-12-0 |
| ,, పిండి (ఎక్సుపెల్లర్) 160 పౌన్లు | 15-0-0 |

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 17:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 66-14-0

| | |
|---|---|
| పెట్టబంగారం తులం రు. | 106-10-0 |
| మూస బంగారు రు. | 105-8-0 |
| సీమవెండి తులం100కి రెడి రు. | 183-0-0 |
| చిల్లర ధర రు. | 1-14-0 |

### వేరుశెనగ

(531 పౌ॥ 1-కి ఎక్సుపోర్టు గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా

| | |
|---|---|
| డిసెంబరు ..రు. | 155-161 |
| వేరుశెనగనూనె ఎక్సుపెల్లర్ బిలో 8% 500పౌ.) రెడీచిల్లరధర | 316-319 |

టెంకాయనూనె (37½ పౌనులు సేల్సుటాక్సు అదనం

| | |
|---|---|
| అంబుమార్కు రు. | 26-0-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 25-8-9 |
| రాజా రు. | 25-12-9 |

### ఆముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పౌ.) రు. | 270-0-9 |

(2 మాండి)

| | |
|---|---|
| బ్రిటిష్, రిఫైన్డ్ షుగర్ | 85-8-0 |
| పారీస్ | 86-4-9 |

రూ 1 కి 0-1-8 ప్రత్యేక సేలుటాక్సు

---

కర్నూలు, ఏప్రిల్ 16: తాడిపత్రిలోని కరింజా బీడీవర్క్సు యజమానులు కార్మికుల మధ్య తగాదాను ఆంధ్రప్రభుత్వం విశాఖపట్టణంలోని పారిశ్రామిక తగాదాల విచారణ సంఘానికి (యిండస్ట్రియల్ ట్రిబ్యునల్) నివేదించింది.

---

## ఆకాశవాణి

గురువారం, ఏప్రిల్ 19

### విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు వలె 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 1 (ఎ) వలె 1-40 హిందీలో వార్తలు 1-50 తెలుగున వా॥ 2 (బి) వలె 2-10 హిందీలో కార్యక్రమం.

సా॥ 5-30 పేదూరి నరసింహారావు వీణ 5-45 సంగీత శిక్షణ 6 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 గీతావళి - బి. రామస్వామినాయుడు 7-30 వీరేశలింగం పంతులు రోజులలో: రాజమహేంద్రవరం (ప్రసంగం) 7-45 శ్రీ కృష్ణతులాభారం - హరికథ కాలక్షేపం వరిగూటి జయమ్మ 8-30 ఎ. ఐ. ఆర్. వాద్యబృందం 8-45 గానసుధ (రి) మధుర మణిఅయ్యర్ 9 ఆంగ్లమున వా॥ 9-15 గీతావళి - బి. రామస్వామినాయుడు 9-30 పేదూరి నరసింహారావు వీణ10 ప్రసారసమాప్తి.

### మద్రాసు (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 కె. జె. త్రిపుర సుందరి.

మ॥ 12-30 ఎం. వెంకటస్వామి రాజు గోటువాద్యం 1 మహిళా మండలి శ్రీరామనవమి (రూపకం) 1-30 (రి) 1-40 హిందీ వా. 1-50 (రి) 2 తమిళమున వా. 2-10 కామయనీ సేవ్య భాష్య సహిత కావ్య పఠనం (హిందీ) ఎ. సి. కామాక్షిరావు 2-40 వేణువు 2-50 వినవలోచని రామస్వామి.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం (రి) 5-30 కె. వి. మల్లయ్య నాదస్వరం 6-5 ప్రాంతీయ వా. 6-15 మద్రాసు రమాపతి 6-45 సి. జయమణి 7-15 తమిళ వా. 7-30 నీతికథ (త) సి. రాజగోపాలాచారి 7-35 క్లారినెట్ 9 జంత్ర సమ్మేళనం 9-15 తిరుచివలె 9-45 భీమసేన జోషీ (మా. 8.) 10 పాశ్చాత్య సంగీతం (రి) 10-20ప్రసార సమాప్తి.

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 ఉదయగానం 7-30 ఎ వలె 8 ఆంగ్ల వా.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 ఎ వలె (రి) 1-30 ఆంగ్ల వా. 1-40 (రి) 1-50 తెలుగు వా. 2.10 ఎ వలె.

సా॥ 5 ఎ వలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆంగ్ల వా. 6-5 ప్రాంతీయ వా: 6-15 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 గీతావళి—బి.రామస్వామినాయుడు 7-30 వీరేశలింగం పంతులు రోజులలో రాజమహేంద్రవరం (ప్రసంగం) 7-45 సంధ్యగానం (రి) 8 తమిళ జానపద గీతాలు 8-15 రాగం తానం పల్లవి (తిరుచి) 9 ఆంగ్ల వా. 9-15 మన సంగీత సంపద సంగీత వాద్యాలను తయారు చేయడం (ఆంగ్ల ప్రసంగం) ప్రొ॥ పి. సాంబమూర్తి 9-30 ఊత్తుక్కాడుకవి వెంకటసుబ్బయ్యర్ కృతులు, నిర్వహణ-సీతామంగళం కృష్ణమూర్తిఅయ్యర్ కీర్తన ఎస్. రాజం 9-45 తిరుచి వలె 10 (రి) 10-30 ప్రసార సమాప్తి.

### హైదరాబాద్

ఉ॥ 6.50సుప్రభాత్ 6-56 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా 7-15 పద్య తనేని వీరయ్యచౌదరి 7-45 కన్నడ వా 8 ఆంగ్ల వా 8-15 హిందీ వా 8-30 ఖయాల్

మ॥ 12-30 వాద్యబృందం (రి) 12-50 మరాఠీ వా 1 స్త్రీ సంసార్ 1-45 వేణువు (రి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాల్ 6 భజన్ 6-15 ఎస్. నరహరి తబ్ల 6-30 వాద్యసమ్మేళనం (రి) 6.40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ 7 తెలుగు వా 7-15 గ్రామసీమ 7-45 శ్రీ రామ స్తవము (పద్యావళి) దాశరథి 8 ప్రసంగం (హిందీ) 8-15 ఖలీసీ భగవాన్ (హిందీ రూపకం) రామమూర్తి వేణు 8-30 ప్రసారగీత్ (ఢిల్లీ) 9 ఆంగ్ల వా 9-15 ఉర్దూ వా 9-30 పర్వతనేని వీరయ్యచౌదరి 10 30 ప్రసారసమాప్తి.

---

## ప్రొద్దుటూరులో స్త్రీ ఆత్మహత్య

ప్రొద్దుటూరు, ఏప్రిల్ 15: ఈ పట్టణంలో జనులగారి వీధి వాస్తవ్యురాలు శ్రీమతి ఓబులమ్మ 9 వ తేదీన చికిత్స నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రిలో చేరింది. ఆ మరుసటి ఉదయమే ఆమె దేహం ఆస్పత్రి ఆవరణ నూతిలో కన్పించింది.

ఆస్పత్రిలో ఆమెకు గుణం కనపించకపోవడం మూలంగా ఆత్మహత్య చేసికొని ఉండవచ్చునని అనుకొంటున్నారు. పోలీసులు శవపంచాయితీ జరిపి దర్యాప్తు చేస్తున్నారు.

---

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు
టెండరులు కావలెను
నెం. AA 4/5551/55

"శిల్లంపూడి ఇంటికి అనుకొనిఉన్న రెండు గాలేజీలను అరు స్నానాల గదులుగా మార్చుటకు" సీలు వేసిన టెండరులను రిజిస్ట్రార్, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేర్, వారు 23-4-1956 సోమవారము సా. 4 గంటలవరకూ తీసుకొనెదరు. ధరక్రింద రు. 2 లతో దరఖాస్తు చేసిన, షెడ్యూళ్లు, స్పెసిఫికేషనులు పొందగలరు.

డిప్యూటీ రిజిస్ట్రార్, వాల్తేర్.

---

### టెండరు నోటీసు

1956-57 సంవత్సరమునకు నెల్లూరు జిల్లాబోర్డు సెంట్రల్ డ్రగ్ అండ్ మెడికల్ స్టోర్సుకు కావలసిన (1) ఆయుర్వేద మందు (ముడిదినుసులు) (2) కంటింజెంటు వగైరా వస్తువులు సప్లయిచేయుటకు సీల్డు టెండర్లు 1956వ సం॥ ఏప్రిలు నెల 30 తారీఖు, సాయంకాలము 5 గంటల వరకు నెల్లూరు జిల్లాబోర్డు ఆఫీసులో తీసుకొనబడును. టెండర్లు సీల్డు కవరులలో పంపవలయును. సదరు సీల్డు కవరుల మీద (1) "ముందుల దినుసులకు టెండరు" (2) "కంటింజెంటు వస్తువులకు టెండరు" అని వేరు వేరుగా వ్రాసి, నెల్లూరు జిల్లా బోర్డు స్పెషలు ఆఫీసరుకు నిర్ణీతమైన తేదీలోపల, చేరులాగున పంపవలయును. టెండరు ఫారములు ప్రతియొకటికి రూ 5-0-0 (అయిదు రూపాయలు) చెల్లించి దరఖాస్తు పెట్టిన జిల్లాబోర్డు ఆఫీసునుండి పనిచేయు దినములలో తీసికొనవచ్చును. యీ అయిదు రూపాయలు రీఫండు చేయబడవు

నెల్లూరు. 11-4-56 } స్పెషలు ఆఫీసరు నెల్లూరుజిల్లాబోర్డు

## గంటల పంచాంగం

శ్రీ దుర్ముఖ సం॥ చైత్ర శు॥ అష్టమి 1956- సం॥ ఏప్రిల్ 18 బుధవారం బు॥ అష్టమి 15-54 పునర్వసు రా 1-20 వర్జ్యం 10-13 ల 11-44 వ.
గు॥ నవమి ఏప్రిల్ 19 గురువారం గు॥ నవమి 13-54 ఆశ్లేష రా 0-8 వర్జ్యం 13-30 ల 15-1 వ.

ఆంధ్రపత్రిక

ఒకట శేయని యొనరించిన
వరవర యపకియము తన మనంబున వగు దా
పొరులకు నలిపేయకునికి
వరాయణము వరమధర్మపథములందెల్లన్
(మహాభారతము)

శ్రీ దుర్ముఖ సం॥ చైత్ర శు॥ అష్టమి
బుధవారం

## ఉపాధ్యాయుల వేతనాలు

ఉపాధ్యాయవృత్తి అత్యంత గౌరవప్రదమైనదనీ, బాధ్యతాయుతమైనదనీ పైకి ఇచ్చకపు మాటలు చెప్పడమే గాని, దాని ప్రతిపత్తికి తగిన జీవన భృతిని ప్రభుత్వం ఇప్పటివరకూ కల్పించలేక పోయింది. ఒక పంచవర్ష ప్రణాళికను పూర్తి చేశాము; మరొకదాన్ని ప్రారంభించాము. అయినా ఉపాధ్యాయుడి పరిస్థితి మాత్రం యథా ప్రకారంగానే వుండిపోయింది. ప్రాథమిక ఉపాధ్యాయుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారైంది.

కూటికీ, గుడ్డకూ చాలని జీతాలతో ప్రాథమిక పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయులు తాలూకా సభలు జరిపారు; జిల్లా సమావేశాలు జరిపారు; రాష్ట్రమహాసభలు సైతం జరుపుకొని కనీసం కుప్పుస్వామి సంఘం చేసిన సిఫార్సులనైనా అమలులో పెట్టి సహాయపడవలసిందని ప్రభుత్వాన్ని అభ్యర్థించారు; ఇప్పటికీ అభ్యర్థిస్తున్నారు. అయితే, ప్రభుత్వం ధనాభావం అడ్డు తగులుతున్నదనీ, ఉపాధ్యాయుల వేతనాభివృద్ధి ప్రస్తుత పరిస్థితులలో అసాధ్యమనీ సమాధాన మిస్తున్నది.

ధనాభావం అన్నది కొత్తగా ఏర్పడ్డదికాదు; విచారణసంఘాలను ఏర్పాటుచేయక ముందు నుంచీ వున్నదే. సిఫార్సులను అమలు చేయలేనప్పుడు, విచారణ సంఘాల నియామకమే అనవసర మనిపించుకుంటుంది. కేవలం కన్నీళ్ళు తుడవడానికీ, కాలహరణం చేయడానికీ మాత్రమే వాటి నియామకం జరుగుతుందని ప్రజలు వ్యాఖ్యానించడానికి అవకాశం ఇచ్చినట్లవుతుంది.

కుప్పుస్వామి సంఘ నివేదిక సిఫార్సులను తక్షణమే గాక పోయినా, సాధ్యమైనంత త్వరలో అమలు జరపడానికి ప్రయత్నిస్తామని అయినా ప్రభుత్వం మాట ఇవ్వలేక పోతున్నది. అందువల్ల చివరకుని వేదిక నిస్పృహాజనకంగా పరిణమించినా పరిణమించవచ్చునని ఉపాధ్యాయులు భయపడటంలో ఆశ్చర్యమేమీ లేదు.

ప్రజాస్వామ్య విధానం పటుత్వదం కావాలంటే విద్యావ్యాప్తి అతి ప్రధానమైన విషయం అని అందరూ అంగీకరిస్తున్నదే. ఏడవనిమిదేళ్ల క్రితం దేశం మొత్తంమీద 141 లక్షల ప్రాథమిక పాఠశాలలు వుండే, గత్యంతర పాఠశాలల్లో 211 లక్షలకు మాత్రమే పెరిగిందంటే ప్రాథమిక విద్యావ్యాప్తి ఎంతో మందకొడిగా సాగుతున్నదీ గ్రహించవచ్చు. విద్యాభ్యాస వయస్కులైన పిల్లల సంఖ్యకూ ఈ పాఠశాలల సంఖ్యకూ ఎక్కడా పొంతనమే కనబడదు; ప్రాథమిక విద్యావ్యాప్తి నిమిత్తం ఇప్పుడు దేశం మొత్తం మీద 46 కోట్ల రూపాయలకు మించి ఖర్చు కావడం లేదంటే, ఫలితం ఇంతకు భిన్నంగా వుండడం అసంభవం.

దేశంలో శీఘ్రంగా విద్యావ్యాప్తి జరగాలంటే, సమర్థులైన వారిని ఉపాధ్యాయ వృత్తికి ఆకర్షించాలి. సక్రమమైన వేతనాలు ఏర్పాటు చేసినప్పుడే సమర్థులను ఆకర్షించడం సాధ్యపడుతుంది.

ప్రాథమిక ఉపాధ్యాయుల వేతనాలను పెంచడానికి భారత ప్రభుత్వం సంకల్పించినట్లు, ఈ విషయమై రాష్ట్ర ప్రభుత్వాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగిస్తున్నట్లు మొన్న పార్లమెంటులో విద్యాశాఖ సహాయ మంత్రి డాక్టరు శ్రీ మాలి చేసిన ప్రకటన ఉపాధ్యాయ వర్గాలకు నిరాశా నిస్పృహాల వాతావరణంలో ఒక ఆశారేఖగా పరిణమిస్తుందనే భావించవచ్చు. మెట్రిక్యులేషన్ ప్యాసై ఉపాధ్యాయశిక్షణ పొందివున్న వారికి నెలకు రు. 50/- లు, శిక్షణ పొందనివారికి రు. 40/- లు కనీస వేతనాలుగా వుండాలని కేంద్ర ప్రభుత్వ ఉద్దేశం. కేంద్ర ప్రభుత్వపు మూడోతరగతి గుమాస్తాల వేతనాలకంటే (ఇటీవలే శ్రీ పంత్ వీరి కనీస వేతనాన్ని రు 60/-లకు పెంచదలచినట్లు ప్రకటించారు) చాలా తక్కువే అయినప్పటికీ, గుడ్డిలో మెల్లగా కొంతవరకు మెరుగేనని ఒప్పుకొనక తప్పదు.

ఇతర రాష్ట్ర ప్రభుత్వాలతోపాటే ఆంధ్ర ప్రభుత్వానికి కూడా ఈ ప్రతిపాదనలు అందివుండాలి. రాష్ట్ర ప్రభుత్వాలు తమ సూచనకు సుముఖంగానే వున్నవనీ, ప్రత్యేక విద్యావ్యాప్తి పన్ను విధించే విషయమై కూడా ఆలోచిస్తున్నారనీ డా॥ శ్రీ మాలి అంటున్నారు. కుప్పుస్వామి సంఘ సిఫార్సుల అమలుకు విముఖంగా వున్న ఆంధ్ర ప్రభుత్వం ఢిల్లీ ప్రతిపాదనకు ఏమి సమాధానం ఇచ్చిందో, లేక, ఇవ్వనున్నదో తెలియదు.

మరొక అయిదారు నెలల్లో ఆంధ్ర తెలంగాణాల విలీనం జరగబోతున్నది. తెలంగాణాలో ప్రాథమిక ఉపాధ్యాయులకు ఇస్తున్న వేతనాలకు, ఆంధ్రలో ఇస్తున్న వేతనాలకు చాలా వ్యత్యాసం వున్న కారణంచేత, నూతన రాష్ట్ర అవతరణానంతరమైనా రాష్ట్ర ప్రభుత్వం ఈసమస్యను ఎదుర్కొనక తప్పదు. అందుచేత ఆంధ్ర ప్రభుత్వం ఉపాధ్యాయుల వేతనాభివృద్ధికి జూన్‌లో పాఠశాలలు తిరిగి తెరిచే నప్పటినుంచే తగిన చర్యలకు ఉపక్రమించడం శ్రేయస్కరం.

## దక్షిణాఫ్రికాలో జాతి వివక్షత

### బస్సులవద్ద పికెటింగ్

కేప్‌టౌన్, ఏప్రిల్ 16: కేప్‌టౌన్ బస్సులలో జాతీయ రవాణా సంఘం ఆజ్ఞ ప్రకారం ఇవాళనుంచి జాతి వివక్షత అమలు జరిపారు.

దీనికి నిరసనగా ఆఫ్రికన్లు బస్సులు నిలిచేచోట నిలబడి పికెటింగ్ ఆరంభించారు. ఆఫ్రికన్లు తెల్లబస్సులు ఎక్కడం మానేశారు.

ముందు నిర్ణయించిన దారులలోనే బస్సులలో వివక్షత అమలు జరిపారు. కాని అన్ని బస్సులు మామూలు ప్రకారంగానే నడిచాయి.

పికెట్ చేసిన వారిలో కొందరు యూరోపియన్లు కూడా వున్నారు.

పికెటింగ్ ప్రశాంతంగా జరుగుతోంది.

## సంస్కృత తరగతులు

1 వ పేజి 2 వ కాలం తరువాయి

దుఃఖపడకుండా సుఖంగా ఉండాలని ఆశిస్తే న్యాయమార్గం విడిచిపెట్టకుండా ఒకరిని బాధపెట్టకుండా ఉండాలని అన్నారు. ఈ ఆర్యోక్తిని అనుసరించి దేశంలో దారిద్ర్యాన్ని మొదలంటా నశింపజేయాలని పంచవర్ష ప్రణాళికలు అమలు జరుపుకొంటున్నాము. అందరం సహకరించి పనిచేయాలి."

అంతకు ముందు పంచాయతీ సంఘం, కొవ్వూరు తాలూకా కాంగ్రెసు, హిందీ ప్రేమీ మండలి, పాఠశాల విద్యార్థులు మంత్రికి స్వాగతపత్రాలు సమర్పించారు.

శ్రీ అప్పారావు మంత్రికి విద్యాపీఠపాలకవర్గ కార్యదర్శి శ్రీ నాగాప్రగడ శ్రీరాములును, పండితులను పరిచయం చేశారు.

### ఏనాదివాడ

అనంతరం ముఖ్యమంత్రి "బాపూజీ" నగరం ప్రక్కన ప్రభుత్వం ఇచ్చిన 3½ ఎకరాల స్థలంలో నిర్మిస్తున్న ఏనాదివాడకు శంకుస్థాపన చేశారు. శ్రీ అల్లూరి బాపినీడు "బావి"కి శంకుస్థాపన చేశారు.

ఏనాదులు ప్రభుత్వానికి కృతజ్ఞత తెలియజేస్తూ తమకుఇచ్చిన నివేశనస్థలం కాకుండా ఇంటికి రు 20 చొప్పున 30 ఇళ్ళకు ప్రభుత్వం సహాయం చేశారనీ ఆ సొమ్ము ఇళ్ళు కట్టుకొనడానికి సరిపోదనీ, కాబట్టి డిప్యూటీ కలెక్టరుకు చెప్పి తాటియాకు, తాటి దూలాలు ఇప్పించాలనీ కోరారు. ముఖ్యమంత్రి ఇంతకంటే ప్రభుత్వం ప్రస్తుత పరిస్థితులలో ఏమీ చేయలేదని, స్థలమూ, ఇచ్చిన సొమ్ము కలిపి రు 10 వేలకుపైగా సహాయం చేశామనీ జెప్పగా వారు సంతృప్తి వెల్లడించారు.

శ్రీ బొమ్మిరెడ్డి వెంకన్న నూతి కట్టుకు ఇటుకలను ఉచితంగా ఇస్తామని సభలో చెప్పారు.

శ్రీగోపాలరెడ్డికి న్యాయవాదులువిందు చేసి ఇక్కడ సబ్-కోర్టును నెలకొల్పవలసిన ఆవశ్యకతను వివరించారు.

మంత్రి శ్రీ రామానంద గౌడీయమఠానికి వెళ్ళి శ్రీ కృష్ణచైతన్య స్వామిని దర్శించారు.

### అన్నదేవర పేటలో పాఠశాల భవనం

మొన్న అన్నదేవరపేటలో శ్రీ అల్లూరి సర్వారాయుడు ఉన్నత పాఠశాల భవనం నిమిత్తం యిచ్చిన స్థలంలో మంత్రి శంఖుస్థాపన చేశారు. భవనం కట్టటానికి కేవలం శంఖుస్థాపన చేసి ప్రయోజనం లేదనీ అందరూ కలసి కృషి చేసి భవనం నిర్మించాలనీ ముఖ్య మంత్రి విజ్ఞప్తి చేశారు.

అనంతరం శ్రీ గోపాలరెడ్డి నూతనంగా నిర్మించిన సహకార గ్రామ బ్యాంకు భవనానికి ప్రవేశోత్సవం జరిపారు.

సహకార రిజిస్ట్రారు శ్రీ సుబ్రహ్మణ్యం నాయుడు పరపతి సంఘాలు గ్రామీణ బ్యాంకులు నెలకొల్పి రైతుల శ్రేయస్సును అభివృద్ధి చేయవలసిన సమిష్టి బాధ్యతను వివరించారు.

శ్రీ గోపాలరెడ్డికి కొవ్వూరు-పోలవరం తాలూకాల బీద విద్యార్థి సహాయ సంఘం, ఆంధ్ర రాష్ట్ర రజక సేవా సంఘం, పంచాయతీ, అన్నదేవరపేట గ్రామీణ బ్యాంకు, వర్జీనియా ఉత్పత్తిదారుల సంఘం స్వాగత పత్రాలు సమర్పించారు.

శ్రీ రెడ్డి ప్రసంగిస్తూ ఆంధ్ర ప్రభుత్వం లోటు బడ్జెటుతో నడుస్తున్నదనీ, రోడ్ల నిర్మాణాలు, ఆసుపత్రులు బీద విద్యార్థులకు ఉపకారవేతనాలు, తదితర కోర్కెలు తీర్చాలంటే ప్రజలు పన్నుల భారం వహించాలనీ, 'మీరు ఇచ్చే డబ్బే మావద్ద ఉంటుందిగాని వేరే ధనం మావద్ద లేదు' అనీ తెలియజేస్తూ, చిన్నచిన్న పొదుపు మొత్తాల ద్వారా ప్రభుత్వానికి ధన సహాయం చేయవలసినదని, మరో రెండు మూడు పంచవర్ష ప్రణాళికలు అమలు జరిగితే దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందగలదని అన్నారు.

వర్జీనియా పొగాకు ధర విషయమై కంపెనీలతో సంప్రదించి తమ సహాయం చేస్తామనీ, పన్ను మాత్రం తగ్గించబోమని తెలియజేశారు.

## ఉపాధ్యాయుల వేతనాలు

1వ పేజి 6 వ కాలం తరువాయి

(పెంటర్స్‌లోనూ అంకెలు హిందీవే ఉండాలనేవారికి జవాబిస్తూ, అది రాష్ట్రపతి ఆజ్ఞ ఇస్తేనేకాని రాజ్యాంగ విరుద్ధం కాదని చెప్పారు. అవసరమైతే ఉత్తరోత్తరా తేలిగ్గా మార్పుతో దానికి వీలుగానే ఇంగ్లీషు అంకెల్ని ఏర్పాటుచేశారని చెప్పారు.

హిందీ విద్యాభ్యాసం విషయంలో కొన్ని విమర్శలను ఒప్పుకొంటూ, ఈ విషయంలో తొందరపాటు చూపకూడదని ప్రభుత్వం అభిప్రాయం అన్నారు. క్రమేణా అయితే హిందీ జాతీయ భావనగా జాతీయైక్యతకు తోడ్పడుతుంది కాని తొందరపడి బలవంతతపెడితే అదే ప్రాంతీయ భేదాలకు కారణమౌతుందన్నారు.

ఉర్దూ విషయంలో అనేకమంది సభ్యులు కేంద్ర విద్యాశాఖను తీవ్రంగా విమర్శించారు. శ్రీ ప్రభుదాస్ పట్వారీ విద్యాశాఖ ఉపాంతం ఒక్కటి కేవలి తెగిపోయినదన్నారు. హిందీని బలవంతంగా రుద్దడానికి వీల్లేదని శ్రీ అవినాశలింగం చెట్టియార్ హెచ్చరించారు. విదేశాలకు పంపుతున్న సాంస్కృతిక రాయబార వర్గాల్ని విమర్శిస్తూ, సంస్కృతి అంటే నాట్యం, నాటకం కాదన్నారు.

స్త్రీలకోసం ప్రత్యేక మహిళా విశ్వకళాపరిషత్తు నెలకొల్పాలని శ్రీమతి గంగాదేవి సూచించారు. జాతీయ చారిత్రక వస్తు ప్రదర్శనాలయాలను సక్రమంగా నడపడంలేదని ఒకరు విమర్శించారు. జాతి అవసరాల కనుగుణంగా విద్యావిధానాన్ని తీర్చి దిద్దలేకపోయారని శ్రీ టాండన్ విమర్శించారు. విద్యార్థి వేతనాలిచ్చే పద్ధతిని పరిశీలించడానికి అవధికార సంఘం నియమించాలని ఒకరు సూచించారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని హిందీ విశ్వవిద్యాలయంగా కేంద్ర ప్రభుత్వం స్వాధీనపర్చుకోకూడదని శ్రీ కృష్ణాచార్య జోషీ వాదించారు. ఆసలీ విషయాన్ని విశాలాంధ్ర శాసనసభకే విడిచిపెట్టాలన్నారు. చర్చ అనంతరం డాక్టర్ శ్రీ మాలి జవాబిస్తూ పై ప్రకటనలు చేశారు.

## ప్రభుత్వ వాణిజ్య సంస్థ వ్యాపారులతో పోటీకి కాదు

### పరిశ్రమల మంత్రి హామీ

### సామ్యవాదంలో ప్రజాస్వామ్యం ఎంత ఉండాలి అని సందేహం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: ప్రభుత్వం స్థాపించదల్చిన ప్రభుత్వ వాణిజ్యసంస్థ వాణిజ్యంలో ఇంతవరకూ తీరని అవసరాలు తీర్చడం కోసమేకాని, వ్యాపారులతో పోటీకివచ్చి ప్రస్తుతం ఎగుమతి దిగుమతులు చేస్తున్న సరుకుల్లోనే విదేశ వ్యాపారం సాగించాలనే అభిప్రాయం లేదని లోక్‌సభలో మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి పరిశ్రమలు వాణిజ్యం పద్దుపై చర్చకు జవాబిస్తూ చెప్పారు.

ప్రజావసరవస్తు సామగ్రి, పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి ఎంతవరకూ వృద్ధి చెయ్యగలరో ఎంత నిశేష కృషి చెయ్యగలరో గరిష్ఠ ప్రమాణాలు అంచనాలువేసి నిర్ణయించాలేకాని, రెండో ప్రణాళికలో అంచనాలకు మించి ఉత్పత్తి వృద్ధికాకూడదనే నిర్బంధం విధించాలని ప్రణాళిక ఉద్దేశం కాదని శ్రీ కృష్ణమాచారి వివరించారు.

ఇంతింత అంచనాలు వేసినా చివరికి రెండో ప్రణాళిక ఆఖరుకు ఉత్పత్తి అయ్యే సామగ్రి దేశానికి చాలనే చాలదన్నారు.

రెండో ప్రణాళికా కాలంలో ప్రజావసర వస్తు సామగ్రి ఉత్పత్తి చురుగ్గా పెరిగే అవకాశం ఉందని శ్రీ కృష్ణమాచారి అన్నారు. అయినా అంచనాలు అవసరాలకు బాగా కొరవగానే ఉంటాయన్నారు.

శ్రీ కృష్ణమాచారి ఇవాళ తమ ప్రసంగంలో రెండుసార్లు ఇది తమ ఆఖరు బడ్జెట్ ప్రసంగం అన్నారు. శ్రీ కృష్ణమాచారి వచ్చే ఎన్నికల్లో పాల్గొనరనే వదంతి దీనివల్ల బలపడుతోంది.

వేసిన ఆయవ్యయముల అంచనాల్లో ప్రజావసర వస్తువుల దిగుమతి ఖర్చులను చేర్చలేదని శ్రీ కృష్ణమాచారి చెప్పారు. ఇవి ఈ దేశంలో ఉత్పత్తి కాగలవని ప్రభుత్వం ఆశిస్తోందన్నారు. అయితే చటుక్కున ఏ వస్తువులకైనా కొరత ఏర్పడితే తీసుకోవలసిన చర్యల్ని కూడా ప్రభుత్వం మరచిపోలేదన్నారు.

ప్రభుత్వ వాణిజ్యసంస్థను స్థాపించడంలో ప్రభుత్వం ఉద్దేశం వ్యాపారుల ప్రస్తుత వ్యాపారాల్లో పోటీ చెయ్యాలని కాదని హామీ ఇచ్చారు. ప్రస్తుతి వ్యాపారంవల్ల తీరని అవసరాలకోసమే ఈ సంస్థను స్థాపిస్తున్నారని చెప్పారు.

కిందటి అయిదేళ్ళలో కొత్తగా ఉత్పత్తిచేస్తున్న వస్తుసామగ్రి తక్కువేమీ కాదన్నారు. పారిశ్రామికాభివృద్ధి మొదటి ప్రణాళికలో తగినంత సాధించారు.

మొదటి ప్రణాళికలలో ప్రభుత్వం ధనం పెట్టుబడి రు 60 కోట్లయితే రెండో ప్రణాళికలో రు 710 కోట్లు, వ్యాపారుల పెట్టుబడి ధనం మొదటి ప్రణాళికలో రు 340 కోట్లు, రెండో ప్రణాళికలో వ్యాపారుల పెట్టుబడి రు 620 కోట్లు ఉండాలని అంచనా వేశారు.

మంత్రి శ్రీ కృష్ణమాచారి చాలవరకు ఇవాళ సామ్యవాద ఆర్థిక సిద్ధాంతాలను గురించే ప్రసంగించారు. సక్రమ విధానంలో వ్యవహరించే ప్రభుత్వానికే ఆర్థిక తత్వంలో సమన్వయదృష్టి కనపడ్డం లేదన్నారు. ప్రభుత్వాధికార బలంతో ఏకైకాధికార సంస్థల స్థాపన అంటే తమకు భయం అన్నారు.

సామ్యవాద ఆర్థికవ్యవస్థను స్థాపించే లక్ష్యాన్ని ప్రభుత్వం స్వీకరించింది. కాని ఈ సామ్యవాద ఆర్థికవ్యవస్థ అనేమాటకి అనేకార్థాలున్నాయి. వస్తూత్పత్తి పరికరాలలో ప్రధానమైనవానినన్నీ ప్రభుత్వాధీనంలో ఉంచే అది సామ్యవాదవ్యవస్థ అవుతుంది. కాని ఇది ప్రజాస్వామ్య సామ్యవాద వ్యవస్థ అవుతుందా? దేశ ఆర్థికవ్యవస్థలో ప్రజాస్వామ్యం ఎంతవరకూ ఉండాలని పార్లమెంటు అభిప్రాయం? ప్రజాస్వామ్యానికి విరుద్ధమైన సామ్యవాదవ్యవస్థ ఏర్పడకుండా, ఆర్థికావసరాలన్నిటినీ వ్యష్టి నిర్వహణకు అతీతమైనపద్ధతి ఏర్పాటు చెయ్యడానికి హామీ లేమున్నాయి?

ఈ ప్రశ్నకింకా ఎవరూ జవాబివ్వలేదని శ్రీ కృష్ణమాచారి అన్నారు. తగిన జవాబు దొరకాలంటే చాల కాలం పట్టవచ్చునన్నారు.

ప్రణాళికా విధానంలో మరొక అంశాన్ని విషయంలోకూడా శ్రీ కృష్ణమాచారి హెచ్చరిక చేశారు. అనుకున్న లక్ష్యాన్ని సాధించడానికి ప్రజలపై త్యాగభారం ఎంతవరకూ ఉంచవచ్చు? ఆర్థిక ప్రణాళికా విధానంలో ప్రత్యక్ష నిర్బంధాలు అవసరమేనని తమకు గట్టి నమ్మకమే ఉందన్నారు. కాని శాంతి కాలంలో ప్రణాళికలు తయారుచేస్తూ, ఇప్పుడే అతిహీన ఆర్థిక దుస్థితిలో ఉన్న ప్రజల్ని, వారి అవసరాలను పూర్తిగా తీర్చగలగడానికి చెప్పలేనంత వ్యవధి పట్టునుందని చెప్పి ఒప్పించడం అసాధ్యం.

రెండో ప్రణాళికలో సాధించదల్చిన ఆశయాలను వివరించి, ప్రజల అవసరాలనుబట్టి చూస్తే, ఇవి చాలా హీనంగా ఉన్నాయన్నారు. ప్రజల జీవన ప్రమాణం పెంచడంలో కానీ, నిరుద్యోగాన్ని నివారించడంలో కాని ఈ ప్రణాళిక అంచనాలు ప్రజలకు ఉత్సాహం కలిగించక పోవచ్చునన్నారు. లక్ష్యాశయాలను సాధిస్తున్నట్లు పైకి కనపడినా ఎన్నటూ సాధించలేని ప్రణాళికా విధానం వ్యక్తిగతం తమకు అంగీకారం కాదన్నారు. సాధ్యమయ్యే టంతకంటె ఎక్కువ సాధించగలమనే ఆత్మవంచనమేలు కాదన్నారు. ప్రణాళికల్లో అంచనాలు వేసేటప్పుడు సమాజసంపద ఎంతఉంది, ఎంత వినియోగించగలం - ముఖ్యంగా కార్మిక బలసంపదనుబట్టి - లక్ష్యాలు నిర్ణయించుకోడం అవసరం అన్నారు.

ప్రణాళికల అంచనాలు ప్రజావసర వస్తువుల విషయంలో క్రియాలోకొన్ని మార్పులకు వినులుబాటుంచవచ్చునని, పారిశ్రామిక యంత్రాదివస్తు సంపద విషయంలో ఖచ్చితంగా ఆఖరున ఎక్కువ తక్కువలు రానియ్యకుండా అంచనాలు విధించడం అవసరం అన్నారు. ప్రజావసర వస్తువుల విషయంలో ఉత్పత్తి అంచనాలు కనీస ప్రమాణాలు నిర్ణయించాలేకాని గరిష్ఠ ప్రమాణాలు నిర్ణయించకూడదు. తరవాత మార్పులేవైనావస్తే వాటివలన ఉత్పత్తి ఎక్కువుండాలేకాని తక్కువుండకూడదన్నారు.

అతి శీఘ్ర పారిశ్రామికవృద్ధిలో ఒక ప్రమాదం ఉందన్నారు. అది విదేశీ ద్రవ్యం ఎంత లభ్యమౌతుందనే విషయం. రెండో ప్రణాళికలో విదేశీ ద్రవ్యం రు 1000 కోట్లు ఖర్చుకి అంచనా వేశారు-దిగుమతి చేసుకోవలసిన ప్రజావసర వస్తువుల ఖర్చుకూడా లెక్కలోకి తీసుకోలేదు.

ప్రజలు వస్తు వినియోగం (పారిశ్రామికాభివృద్ధి కోసం) ఖర్చు చాలాతగ్గించేసుకోవాలని వాదించే ఆర్థిక శాస్త్రజ్ఞులు అవసర వస్తువులు కొరవైనప్పుడు ప్రజలేవిధంగా ప్రవర్తిస్తారో గుర్తించరు. అని శ్రీ కృష్ణమాచారి అన్నారు. హఠాత్తుగా వస్తువుల కొరత ఏర్పడితే ప్రమాదాన్ని ఎన్నటూ మరిచిపోవకూడదు. ఇప్పుడు సిమెంటుకీ ఉక్కుకీ అలాగే కొరతేర్పడింది.

సిమెంటు వీలైనంత చౌకలో దిగుమతి చేసుకోడానికి ప్రభుత్వం ఏర్పాటు చెయ్యవలసి వస్తోంది. కాని ఎంత చౌకలో దిగుమతి చేసినా అది ఇక్కడి ధరలకంటె ఎక్కువే ఉంటుంది.

1956 లో దేశంలో ఉత్పత్తి అయ్యే 13 లక్షల టన్నులు దిగుమతి చెయ్యబోయే 18 లక్షల టన్నులు కలిపినా అవసరాలకిపొంగ్గిచాలనిదే అవుతుంది. దిగుమతిచేసే ఉక్కులో కొంతభాగం చిన్న పరిశ్రమలకివ్వాలనుకుంటున్నానని మంత్రి చెప్పారు.

వాణిజ్య లోటు బలం వస్తేనే అంతే. రెండో ప్రణాళికలో వృద్ధిచేసే బలం కూడా ఏమాత్రం చాలదు.

అందువల్ల వస్తూత్పత్తి ఎంత పెంచినా ప్రణాళికవల్ల అంతరాయంవిమీ ఉండదని శ్రీ కృష్ణమాచారి అన్నారు. అంచనాలు వేసేది, కనీసం అదైనా ఉత్పత్తి చెయ్యడానికి కృషి చెయ్యాలనే ఉద్దేశం కావాలి. అంతేను మించరాదనే ఉద్దేశం కాదని చెప్పారు.

ఉక్కు పరిశ్రమలో ఒక ప్రాంతంలో పారిశ్రామికాభివృద్ధివల్ల తామే అన్యాయం శ్రద్ధ చూపి పక్షపాతం చూపుతున్నారని వచ్చిన విమర్శ న్యాయం కాదని శ్రీ కృష్ణమాచారి అన్నారు.

## ఎన్నికలకు అభ్యర్థులు

### కాంగ్రెసు సంఘం పరిశీలన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: మే 2, 3, 4 తేదీలలో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు, కార్యదర్శుల సమావేశం జరిపి 1957 ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థులను ఎంచే విషయం పరిశీలించాలని కేంద్ర కాంగ్రెస్ ఎన్నికల సంఘం నిర్ణయించింది. ఈ సంఘం నిన్న ఇక్కడ సమావేశమైంది.

ఎన్నికలకు అభ్యర్థి పత్రాలు పంపడానికి నెలరోజులు ముందుగా కాంగ్రెస్ అభ్యర్థులను నిర్ణయించాలని ఈ సంఘం ప్రయత్నం. అంటే అన్ని నియోజక వర్గాలనుంచీ కాంగ్రెస్ అభ్యర్థుల నిర్ణయం నవంబరు నెలలోనే పూర్తవుతుందన్నమాట.

అభ్యర్థులను ఎంచే కార్యక్రమాన్ని నిర్వహించే పద్ధతిని మే మొదటివారం రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు కార్యదర్శుల సమావేశంలో చర్చించి నిర్ణయిస్తారు.

అభ్యర్థులను ఎంచడానికి ఇదివరకే ఒక విధానాన్ని కేంద్ర ఎన్నికల సంఘం తయారుచేసింది. ఈ విధానాన్నికూడా ఈ సంఘం నిన్న చర్చించింది.

ఈ విధానం ప్రకారం జిల్లా కాంగ్రెస్ సంఘాలు, ఇతర కాంగ్రెస్ సంఘాలను అభ్యర్థులనుగురించి సూచనలను మొదట రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికల సంఘాలు అడగాలి. అప్పుడు కేంద్ర ఎన్నికల సంఘానికి చెందిన ఒక ప్రతినిధిని రాష్ట్ర ఎన్నికలసంఘం సంప్రదించి, రాష్ట్ర ఎన్నికల సంఘ ప్రతినిధులను ప్రతిజిల్లా కార్యస్థానానికి పంపి, స్థానికుల అభిప్రాయాలను తెలుసుకుని అర్హులైనవారిపేర్ల జాబితాలు తయారుచేయాలి. ఒక్కొక్క అభ్యర్థి స్థానానికి అయిదు పేర్లకంటె పేర్లు జాబితాల్లో చేర్చరాదు.

ఈ జాబితాలను రాష్ట్ర ఎన్నికల సంఘం కేంద్రసంఘ ప్రతినిధితో కలిసి పరిశీలించి అభ్యర్థులను ఎంచి, ఆ జాబితాను కేంద్ర ఎన్నికలసంఘానికి పంపాలి, వీనితోపాటు మొదటి జాబితాలను కూడా పంపాలి. ఆ మొదటి జాబితాలలోనుంచి ఏ అభ్యర్థుల ఎందుకు ఎంచారో కారణాలు వివరించాలి.

ప్రదేశ్ ఎన్నికల సంఘ నిర్ణయాలు ఏకగ్రీవం కానిపక్షంలో, అధిక సంఖ్యాకుల నిర్ణయాలను, అల్ప సంఖ్యాకుల అభిప్రాయాలనూ కేంద్ర సంఘానికి వివరించాలి.

అప్రైన రాష్ట్ర ఎన్నికల సంఘాల సూచనలను కేంద్ర ఎన్నికల సంఘం పరిశీలించి తుదినిర్ణయాలు చేస్తుంది.

ఈ కార్యనిర్వహణలో రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యకర్తలతో సంప్రదించి అవసరమైన స్వల్ప సవరణలు చేసుకోవచ్చును.

ఎన్నికల సంఘం ఇదివరలో నిర్ణయించిన అర్హతలన్నీ అభ్యర్థులకు ఉండడం అవసరం.

ఈ అర్హతల్లో ఇదివరలో సేవా వివరాలు, అభ్యర్థుల సాంఘిక దృక్పథం, ముఖ్యంగా అస్పృశ్యత, భూసంస్కరణలు, కార్మిక సంక్షేమం, ఆర్థిక సమన్వయం వీనిపట్ల దృక్పథం, పాత శాసనసభ్యులైతే ఇదివరలో నియోజక వర్గాలతో వారెంత సన్నిహితంగా ఉన్నారో ఆ వివరాలు, నిర్మాణ కార్యక్రమంలో అభ్యర్థుల శ్రద్ధ మొదలైనవి ఉన్నాయి.

## హిందూ ముస్లిం పరటా

### పాక్‌భారత సమస్య: తారాసింగ్ సలహా

ఫిరోజ్‌పూర్, ఏప్రిల్ 16: భారత పాకిస్తాన్ దేశాలమధ్య యుద్ధం అంటూ సంభవిస్తే అల్పసంఖ్యాక వర్గాల వలస విషయంలోనే రావాలి. కాశ్మీర్ సమస్యపై యుద్ధం రావటానికి అవకాశం లేదు అని అకాలీ నాయకుడు మాస్టర్ తారాసింగ్ తెలియజేశారు.

తారాసింగ్ ఒకచోట ప్రసంగిస్తూ ఇలా అన్నారు: "తూర్పు పాకిస్తాన్ నుంచి హిందువుల వలస ఆ పటానికి జనాభా మార్పిడి ఒక్కటే పరిష్కారమార్గం. పాకిస్తాన్‌ను విడిచిపెట్టిరావాలని కొరి హిందువులను, అక్కడే ఉండాలని బలవంతం చేయటం న్యాయంకాదు. ఈ విధంగా చేయటం వారు మహమ్మదీయులై పోవటానికి ఒకవంతే చెప్పటమే అవుతుంది. అలాంటివారు భారతదేశానికి వచ్చేయ్యటానికి అనుమతిస్తూ, వారికి సరిసంఖ్య గల మహమ్మదీయులు పాకిస్తాన్ పొయ్యేటందుకు అంగీకరించాలి.

## అణ్వస్త్ర బాధితుల బిడ్డలకు అబాధ లేదు

టోక్యో, ఏప్రిల్ 16: నాగసాకి హిరోషిమాలలో అణుబాంబు దెబ్బలకు గురియైన వారి పిల్లలకు రేడియేషన్ వ్యాధులు సంక్రమించవని డా॥ మసావో సుజాకి నేడు తెలియజేశారు.

## తూర్పు పాక్ హిందువులకు ఉద్యోగ సౌకర్యాలు

### కొన్ని కేటాయించారని ముఖ్యమంత్రి ప్రకటన

ఢాకా, ఏప్రిల్ 16: తూర్పు పాకిస్తాన్ ఆహారశాఖలో నూరింట 23 వంతులు అల్పసంఖ్యాకులకు కేటాయించాలని ప్రభుత్వం ఆదేశమిచ్చినట్లు ముఖ్యమంత్రి శ్రీ అబుల్ హుసేన్ సర్కార్ తెలియచేశారు.

రేషన్ దుకాణాల్లో కూడా కొన్నిటిని అల్పసంఖ్యాకులకు కేటాయించాలని ఉత్తరు విచ్చారట.

కొందరు అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన నాయకుల సూచనపై ఈ ఏర్పాట్లు చేశారు.

ఇతరప్రభుత్వశాఖల్లో కూడా ఇలా కేటాయించాలని ఈ నాయకులు తూర్పు పాకిస్తాన్ ప్రభుత్వానికి సూచించారట.

వివిధ ప్రభుత్వశాఖల్లో ఖాళీలు ఏర్పడుతూ వుంటే, అల్పసంఖ్యాకుల్ని నియమించడానికి ప్రయత్నిస్తున్నట్లు శ్రీ సర్కార్ చెప్పారు.

ఏప్రిల్ 6 వ తేదీన అల్పసంఖ్యాక సలహా సంఘం చేసిన సూచనల్ని అమలు జరపడానికి శక్తి వంచన లేకుండా యత్నిస్తున్నారని చెప్పారు- ఉద్యోగం విరమించిన ఒక ఇంజనీరు శ్రీ జోగేశ చంద్రదాస్‌ను రాష్ట్ర ప్రభుత్వోద్యోగ నియామక సంఘ సభ్యులుగా నియమించారు.

రాష్ట్ర అల్పసంఖ్యాక సలహా సంఘంలో అల్పసంఖ్యాకుల కోరికపైన ఒక ముస్లిం సభ్యుని కూడా నియమించారు. త్వరలోనే ఈ సంఘాన్ని తిరిగి సమావేశపరచగలరని శ్రీ సర్కార్ చెప్పారు.

## తూర్పుపాక్ శరణార్థులు

### ఢాకాలో మే 5 న రెండుదేశాలచర్చలు

కరాచీ, ఏప్రిల్ 16: తూర్పు పాకిస్తాన్ నుంచి అల్పసంఖ్యాక వర్గాల పరారీ విషయమై చర్చించడానికి ఢాకాలో మే 5, 6 తేదీలలో ఒక సమావేశం జరగాలనీ యిది మంత్రివర్గ స్థాయిలో ఉండాలనీ భారత దేశానికి సూచించింది.

పాకిస్తాన్ ప్రధాని చౌదరీ మహమ్మదాలీ నిన్న సరిగా టెహరాన్‌కు బయలుదేరే ముందు శ్రీ నెహ్రూకు యీ సూచనను తంతిద్వారా పంపారని తెలుస్తున్నది.

పాకిస్తాన్ ప్రతినిధి వర్గంలో విదేశాంగ మంత్రి శ్రీ హమీదుల్ హక్ చౌదరీ, దేశీయాంగమంత్రి శ్రీ అబ్దుల్ సత్తార్, తూర్పు బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ అబూహుస్సేన్ సర్కార్ తదితరులు ఉంటారు.

భారత పునరావాస శాఖామంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా, పాకిస్తాన్ రిపబ్లిక్ దిన ఉత్సవాలకు కరాచీ వెళ్ళినప్పుడు మొదటిసారిగా యీ సూచనను చేశారని యీ తంతిలో ఉన్నట్లు చెప్తున్నారు.

ఈ సమావేశానికి నిర్ణయించిన ప్రదేశము, తేదీలను భారతదేశం తప్పక అంగీకరించ గలదని తమకు నమ్మకం ఉందని పాకిస్తాన్ వర్గాలవారు వెల్లడించారు.

### హిందువుల గృహాలు

ఢాకా, ఏప్రిల్ 17: భారతదేశం పారిపోయినప్పటికీ తిరిగి పాకిస్తాన్ వచ్చి స్థిరపడదల్చిన హిందువులకు వారి గృహాలను వారికి తిరిగి ఒప్పగించగలరని పాకిస్తాన్ అల్ప సంఖ్యాక వ్యవహారాల మంత్రి శ్రీ నూరుల్ హక్ చౌదరి చెప్పారు. అయితే ఆ హిందువులు అక్కడే ఉండిపోతారనీ, వచ్చినట్లే వచ్చి ఇళ్లు అమ్ముకొని తిరిగి పోవాలంటే ఊరుకోరనీ షరతు ఉందన్నారు.

అల్ప సంఖ్యాకుల విషయంలో ప్రభుత్వాజ్ఞలను సరిగ్గా నిర్వహించని ఉద్యోగులపై ప్రభుత్వం కఠిన చర్యలు తీసుకుంటుందన్నారు.

## పశ్చిమాసియా వ్యవహారాలు

### ఫ్రాన్సు సూచనకు అమెరికా అయిష్టం

వాషింగ్టన్, ఏప్రిల్ 16: పశ్చిమ ఆసియా వ్యవహారాలను పరిశీలించడానికి బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సుల సమావేశం జరగాలంటూ ఫ్రాన్సు చేసిన సూచనను ఒకదాన్ని అమెరికా తిరస్కరించినట్లు తెలుస్తున్నది. ఇలాంటి సమావేశంవల్ల మేలు ఏమీ జరగదని అమెరికా భావిస్తున్నట్లు ఇక్కడి అభిజ్ఞులు చెబుతున్నారు.

## బాగ్దాద్ కూటమి సమావేశం

### సైనిక సహకారం ముఖ్యలక్ష్యం

టెహరాన్, ఏప్రిల్ 16: బాగ్దాద్ కూటమి సమావేశ చర్చనీయాంశాలలో కాశ్మీర్ వ్యవహారాన్ని చేర్చరాదని సారథ్య సంఘం నిర్ణయించినట్లు అభిజ్ఞ వర్గాల ద్వారా తెలుస్తున్నది.

బాగ్దాద్ సంఘం సమావేశం నేడు ఇక్కడ ప్రారంభమైంది. ఇది ప్రారంభం కాక పూర్వం భారత్ రాయబారి డా॥ తేక్‌చంద్ ఇరాన్ ప్రధాని శ్రీ హుస్సేన్ అలాను, విదేశాంగమంత్రి డా॥ అర్దలాన్‌ను కలుసుకొని కాశ్మీర్ విషయమై పాక్ ప్రధాని, విదేశాంగ మంత్రులు చేస్తున్న ప్రకటనలను గురించి మాట్లాడారు. కాశ్మీర్ సమస్యను ఈ సంఘ సమావేశంలో చర్చకు తెస్తే, భారత దేశంతో ఈ దేశాల సహవాసానికి కళంకం ఏర్పడుతుందనీ, బాగ్దాద్ కూటమి దేశాలలో చాలా దేశాలు భారత దేశంతో సహవాసం కోరుతున్న దేశాలేననీ చెప్పారు. ఇరాన్ ప్రధాని, విదేశాంగ మంత్రి భారత రాయబారి భావాలతో ఏకీభావాన్ని చూపించారు.

ఇవ్వాళ జరిగిన బాగ్దాద్ కూటమి సభకు శ్రీ హుస్సేన్ అలా అధ్యక్షత వహించారు. తమ ఉపన్యాసంలో ఇరాక్, పాకిస్తాన్, బ్రిటన్, టర్కీ ప్రతినిధులకు స్వాగతం చెప్పి ఈ సంధిపట్ల కొన్ని కొన్ని దేశాలు వహిస్తున్న వ్యతిరేక వైఖరి విషయం ప్రస్తావించారు. "కొన్ని దేశాలు ఎందుకు ఈ సంధిపట్ల విరోధాన్ని, వ్యతిరేక భావాన్ని వహిస్తున్నాయో తెలుసుకోవాల్సి వుంది. కాని ఈ పశ్చిమ ఆసియా ప్రాంతంలోని కొన్ని రాజ్యాల విరోధం మాత్రం అర్థం కావడంలేదు. అయితే కాలక్రమేణా అంతా వారికే విశదం అవుతుంది" అన్నారు.

శ్రీ హుస్సేన్ అలా అమెరికా త్వరలో ఈసంధిలో చేరగలదన్న భావాన్ని కూడా వ్యక్తం చేశారు. ఇదేభావాన్ని పాకిస్తాన్, ఇరాక్ ప్రతినిధులుకూడా వెల్లడించారు. అమెరికానుంచి ఒక పరిశీలక బృందాన్ని వెంటబెట్టుకొనివచ్చిన శ్రీ లాయ్ హెండర్సన్ మాటిగా జవాబివ్వకపోయినా బాగ్దాదు కూటమి ద్వారా సాగే సహాయకార్యక్రమంలో తాముచేసే సహాయ కార్యక్రమాన్ని జతచేసి నడిపించడానికి తమ ప్రభుత్వం సిద్ధంగా వున్నట్లు తెలియజేశారు.

బ్రిటిష్ ప్రతినిధి సర్ వాల్టర్ మాంక్టన్ మాటలాడుతూ, దురాక్రమణదారులకు భయం కలిగే విధంగా ఈ రాజ్యాల సైనిక సంపత్తిని సమైక్యంగా పెంచవలసి వున్నదని, ఇప్పుడు టెహరాన్‌లో నిర్వహించవలసినపని ఇదే అని అన్నారు.

అరబ్-ఇజ్రేల్ తగాదాపై పాక్ ప్రధాని శ్రీ మహమ్మదాలీ ప్రసంగించారు. "పశ్చిమ ఆసియాలో శాంతిభద్రతకు ఈసమస్య సత్వర పరిష్కారం అత్యవసరమని మేము భావిస్తున్నాము. ఇదే లక్ష్యంతో సమితి కార్యదర్శి సాగిస్తున్న కృషి సఫలం కాగలదని మేము ఆశిస్తున్నాము." అన్నారు.

ఇరాక్ ప్రధాని జనరల్ నూరిఅల్ సయద్ అమెరికా ఈ కూటమిని బలపరుస్తున్నందుకు హర్షాన్ని వ్యక్తం చేశారు. అరబ్-ఇజ్రేల్ సమస్యలను అల్జీరియా వ్యవహారాన్నికూడా వీరు ప్రస్తావించారు. అల్జీరియా సమస్యను సమితి ధర్మాల ప్రకారం, స్వయం నిర్ణయం సూత్రాను గుణంగా పరిష్కారం చెయ్యాలని అన్నారు.

ప్రారంభ సమావేశం ముగియగానే, వీరు అనేక ఉపసంఘాలుగా ఏర్పడి నివేదికలను ఆలకించే నిమిత్తం రహస్య సమావేశాలు జరిపారు. ఈ ఉపసంఘాలు ప్రాదేశిక చర్యలను ఆర్థిక సహకారాన్ని, గురించి నివేదికలను తయారు చేశాయి. వీటితో సైనిక వ్యవహారాలపై మంతనాలుకూడా జరుగుతున్నాయి. అమెరికా ప్రతినిధి వర్గంలో వున్న పెద్దపెద్ద సైనికోద్యోగులుకూడా ఇందులో పరిశీలకులుగా పాల్గొంటున్నారు.

న్యూయార్క్, ఏప్రిల్ 16: రష్యా ఆర్థిక పథకాలలో ముఖ్యమైన వివరాలను ఇప్పటికి ఐక్యరాజ్య సమితికి పంపారు. ఇవి లేకపోవడం సమితి సేకరించే వివరాలలో ఇంతవరకు లోపంగా ఉండేది.

